# విషయసూచిక

# ప్రబోధము

[ఇంద్రగంటి నాగేశ్వరశర్మగారు]

ఏల రుద్రాక్షమాలిక, ♦ ఏల జపము
లేల మంత్రపఠనము లీ ♦ లీల యింక,
ఘోరజీమూత గాఢాంధ ♦ కారపటలి
అలముకొనియున్న యీ మూల ♦ నంతదిష
నెవరిఁ బ్రార్థించుచుంటివో ♦ యెఱుఁగనగునె?
తెఱువు మొకసారి నేత్రాలఁ ♦ దెలివితోడ;
కాంచఁగా లేవు నీస్వామిఁ ♦ గనులయెదుట.

కష్టములకోర్చి పనిసేయు, ♦ కర్షకుల నె
పుడు కలసి, యెండవానలఁ ♦ బూన్కితోడు
పడుచునుండెను, నాతని ♦ యుడుపులెపుడు
ధూళి ధూసరరేణుల ♦ తోడ నిండె;
విడువు మికనైన నీమేలి ♦ యుడుపులింక,
కష్టజీవుల కష్టాలఁ ♦ గలియు మయ్య
యాచటఁ గాంతువు నీస్వామి ♦ ననవరతము.

ఎట విమోచనమున్నదో ♦ యెఱుఁగఁ దరమె?
మనదు స్వామియె సంతోష ♦ మనముతోడ
స్వీకరించెను కష్టము నె ♦ చ్చెలుఁడ! సృష్టి
బంధనమ్ముల కష్టాలఁ ♦ బడులకొఱకు—
వెడలు మికనైన ప్రార్థన ♦ వేదినుండి
ధూప దీపాల పుష్పాలఁ ♦ ద్రోచివైచి;
ఎట్టికీడుండె నీమేని ♦ పుట్టము లిల
మచ్చపడినను, ధూసర ♦ మయి మాయినను?
పాలు గొనుమయ్య కృషికుని ♦ బాధలందు,
అచటఁ గాంతువు నీస్వామి ♦ ననవరతము.



# జాబులు వ్రాయు లక్షణాలు

[వసమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు]

(౧సం. సం. ౨ తరువాయి)

శ్రీవైష్ణవులకు వ్రాయు లక్షణము

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంతాచార్య ప్రవర్తకులయిన, శాంతిశమదమాద్యనంత కల్యాణగుణ పరిపూర్ణులయిన, అస్మదాచార్యులయిన, ప్రాణ ప్రాపకులయిన, శ్రీఅళగియ తిరువేంగళనాథస్వామి నిత్యకైంకర్యపరులైన, అష్టోత్తర శతాచార్యులయిన, ఆపస్తంబ సూత్రులయిన, సాంభ్యాయన పదములయిన, తిరిచ్చాణూరిన భాష్యులయిన, శఠగోప తిరువేంకటాచార్యులవారి దివ్య తిరువడి పొళతామరల సన్నిధికి, అడియేన్ దాసానుదాస చరమావధి దాసులు...... కైంకర్యం కూర్చి సేవించి చాయుంగల విన్నపములు—

శంకరాచార్యులవారికి వ్రాసే లక్షణమ్

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య పదవాక్య ప్రమాణపారావార పారీణయమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణ సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠాగరిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్య విచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సంప్రదాయక షడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థ ప్రకాశక సాంఖ్యత్రయ ప్రతిపాలక సకల నిగమాగమ సారహృదయ వైదికమార్గ ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్రాది బిరుద విరాజిత, విద్యానగర మహారాజధాని, కర్ణాటక ప్రతిష్ఠాపనాచార్య, గురు భూమండలాచార్య, తుంగభద్రాతీర వాస, ఋశ్యశృంగగిరిపురవరాధీశ్వర, శృంగేరి, శ్రీవిరూపాక్ష, శ్రీవిద్యాశంకర, దేవర దివ్య శ్రీపాద పద్మారాధక, అభినవ కరకమల సంజాత, అభినవోద్దండ నృసింహ భారతీ స్వాముల చరణారవిందాల సన్నిధికి— అత్యంతప్రియశిష్యులు......విజ్ఞాపనము—

అయిద్దారు పన్నాతులకు వ్రాసే లక్షణం

స్వస్తి సమస్త త్రిభువన భవన నిర్మితోద్ధార, అనంత వేదశాస్త్ర పారావార గాంభీర్యులయిన సకల విద్యా విశారదు లయిన కాళికాదేవీకమఠేశ్వర కళా ప్రవీణులయిన, పేషిణీ సామునాంత పెండోల పురవరాధీశ్వరు లయిన, పదవాక్య ప్రమాణజ్ఞు లయిన, షణ్మార్గభేదములయిన, చతురుపాయ సమర్థు లయిన, సకల

నిర్మాణ పరో ధురంధరు లయిన, సకల రాజాస్థాన నిర్మల నిర్మిత నిరూఢ నిగర్వ సింధు శిరోమణులయిన, నయ వినయ దాక్షిణ్య పరోపకార పుణ్యమూర్తులయిన మహామేరు సమానులగు మునిగాప్ర అయ్యగారు పంచాననం గారికి—బాలో ం బుట్టువులయిన తథావిధ గుణ సంపన్నులయిన......వ్రాయించిన శరణార్థి......

జీనుగరవారి వర్ణన

స్వస్తి సమస్త శ్రీమన్మహాదేవ కరుణా కటాక్ష వీక్షణా లంకారులైన సంపాదితాష్టైశ్వర్యసంపన్నులయిన అయోని సంభవులయిన జామమండల రాక్షస తల గుండు గండ బిరుదాంకులైన, సకల రాక్షస గర్వపర్వ వజ్రాయుధు లయిన మైలారుదేవర వరప్రసాదులయిన నిమిష్మాదేవీ కటాక్ష విశారదులయిన శ్రీ వేంకటేశ్వర పాదధ్యానామృతసేవకు లయిన మేదినీ రాయగాహుత్తులైన గజదళాశ్వదళ ఉభయదళ చతురంగ శృంగారకులయిన చీని చీనాంబర మహేశ్వరులయిన నానారత్న పరీక్షకులయిన ఈశ్వర ముఖపద్మమందు జనించిన ముక్తఋషివంశోద్భవు లయిన ఉభయ నానాదేశానుగ్రహులయిన కావ్య ప్రవీణులయిన, అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళ సప్త లోకాధీశ్వరులయిన భూలోక భువర్లోక సువర్లోక మహాలోక తపోలోక సత్యలోక జనలోక బ్రహ్మలోక యింద్రలోక లోకాధీశ్వరులయిన, గ్రహ మండల కేతు మండల వాయు మండల వహ్ని మండల నక్షత్ర మండలంబులు మొదలుగా X ల విచిత్ర నిర్మితాకారు లయిన మేరుగిరి మందరగిరి కైలాస మధ్యమం దున్న శ్రీ పార్వతీ పరమేశ్వరుల పాద పంకజ భక్తులున్న, ఏకాదశ రుద్రద్వాదశాదిత్యదక్షాది సమర్థు లయిన, దిశాయజ్ఞోపవీతధారు లయిన భారత భాగవత రామాయణేతిహాస శ్రవణపూరితు లున్న, బ్రాహ్మణ సంతర్పణాతిథి సంరక్షణ భోగ మండప దేవమండప గురుమండప కల్యాణమండపంబులు మొదలగు ధర్మోపకారు లయిన, హనుమధ్వజ గరుడధ్వజ సర్ప ధ్వజంబులు గల బిరుదాంకు లయిన పంచ మహావాయిద్య సిద్ధయోగంబులు గల యాగ విశేషజ్ఞు లయిన హరిహర గురు భక్తి పరాయణు లయిన ముక్తఋషి వంశక్షత్రియ కులోద్భవు లయిన శ్రీమహామేరు సమానధీరులగు రాచూరు కిల్లాలో వున్న మాచెలగ అయ్యన్నగారికి—కందనూలి మల్యాలో నుండు......సేవించిన విన్నపములు—

# భారతి

[ నేలట వీరరాజకవులు ]

౧

హా! బ్రహ్మాజీ! హా! భారతీ! నేను మీ కొనరించిన పాపాతిశయమే నన్నిట్లు కష్టపెట్టుచున్నది కాఁబోలు. అయ్యో! నేను బాధ భరింపఁజాల! భరింపఁజాల! ఊఁ, ఊఁ, యని యొక వయోవృద్ధుఁడు రోగబాధాపీడితుఁడై కింబళి గప్పుకొని మంచముపైఁ బరుండి మూల్గుచుండెను. అతని పదసన్నిధి నొక యువతిలలామ కూర్చొని మామగారికి సేవఁ జేయుచుండెను. బ్రహ్మాజీరా వొక గ్లాసులోఁ బెట్టిన ద్రావకమును గొని తండ్రికిఁ బట్టుచుండెను.

అత్తరి నా ముసలివాని భార్య యగు సుందరమ్మ చేతులు విదల్చుకొనుచు విపరీతముగా శిరఃకంపము గావించుచు కోపముతోఁ బ్రవేశించి కోడలిని సమీపించి "ఓసీ! వంగనాచీ! ఇంటి పనులఁ గట్టిపెట్టి యిప్పటను వచ్చి వృథా కాలయాపనముఁ జేయుచుంటివా? బాగుబాగు" నని దూషింప నారంభించెను.

సవతితల్లి దూషణాలాపము నాలించుచున్న బ్రహ్మాజీరావా మాటలఁ బాటింపక ముఖమునుదిగ్రుగుచుండెను. అంతట భారతి "అత్తయ్యగారు! నేటిరాత్రి యెట్లు గడచునోకదా యని భయపడి మామగారికి శుశ్రూషఁ జేయుట వృథా కాలయాపనమా! మీవంటి పెద్దలిట్లు వచింపఁదగునా?" యని వినయావనత వదనయై పలికెను. సుందరమ్మ కోపముతో "ఓసీ గయ్యాళీ! నీవు నాకు బదులు చెప్పెదానవా? ఇఁక చాలింపుము" మని కన్నులెఱ్ఱచేసెను.

ఇంతలో ఋణదాత లనేకులు వచ్చి యమకింకరులవలె ప్రత్యక్షమైరి. వారలం గాంచి యావృద్ధుఁడు భార్యతో "సుందరీ! నీవు పెట్టుకొనుచున్న వస్తువులలోఁ గొన్ని విక్రయించి ఋణవిముక్తిఁ జేయుము" మని యుచ్ఛ్వాసనిశ్వాసలతో ననెను. "ఓహో! నీ ప్రయోజకత్వ మిదియా! నాపుట్టింటనుండి తెచ్చుకొనిన నగలు కాఁబట్టి కాని లేకున్న నింతకంటె పెత్తనము చేతువు కాఁబోలు! చాలు! చాలు!" నని యామె తన దుడుకుతనమును వెల్లడించెను.

ఆమాటలను విన్నతోడనే యావృద్ధుఁడు కన్నులెఱ్ఱచేసి "ఏమే? కృతఘ్నురాలా! నీపుట్టింటనుండి తెచ్చుకొంటివా? కట్టుబట్టయైనలేని గర్భదరిద్రురాలవగు నీకు నా సంపాదనములో సగము వెచ్చించి రహస్యముగా నగలు చేయించినందులకుఁ దగిన శాస్తిఁ జేసితివి. హీనవంశ సంజాత

వగుటచే నింత విశ్వాసఘాతుకురాల నైతి" యని రౌద్రాకారుఁడై పల్కెను. అందులకు సుందరమ్మ "ఇట్టి వయోవృద్ధుని గట్టుకొనినందుల కిదియా ఫలము. కానిమ్ము. నీ వేమిచేసినను సరే! నేనొక్క గవ్వయైన నీయదలఁచుకొనలే దని నిర్భయముగాఁ బదులుచెప్పెను. అది విని ఋణదాత లా ముదుసలిని మరింత తొందరఁ జేయసాగిరి. అంతట సుగుణఖని యగు భారతి వారల కభిముఖయై "అయ్యలారా! వ్యాధిపీడితు లగు మామగారిని శ్రమ పెట్టకుఁడు. ఇవిగో నాయలంకారములను గైకొనుఁడు" ని మెన వస్తువుల నొక్కటొక్కటిగా దీసి వారల కర్పించెను.

తోడనే ముదుసలి "హా! శ్రీహరీ!" యని ప్రాణములను విడచెను. అచ్చటగల యెల్లవారలు గొల్లున నేడ్వసాగిరి. ఆయాక్రందనధ్వని విని యిరుగుపొరుగువా రరుదెంచి వారల నోదార్చినపిదప నావృద్ధున కగ్నిసంస్కారముల జరిపిరి.

౨

బ్రహ్మాజీరావు విచారచేతస్కుఁడై శయ్యాతలంబునఁ బండుకొని యుండెను. అట్టిసమయమున నొక యువకుఁ డాతని యొద్దకు వచ్చి "బ్రహ్మాజీ! విచారముగా నుంటివేల?" యని ప్రశ్నించెను. అంత నాతఁడు దుఃఖము నాపుకొని "మిత్రమా! రంగారాయ! నీ విషయంగని సమాచారమేమి కలదు? నా సవతితల్లి పెట్టుచున్న బాధలు దినదినాభివృద్ధిఁ జెందుచున్నవి. ఇంక నే భరింపజాల!

రంగారావు—అయ్యో! నీతండ్రి మృతినొందిన నీతల్లికింకను దయ రాలేదా?

బ్రా—ఆహా! అంతయదృష్టమునకు పెట్టిపుట్టినగదా?

ఉ. క్రూరమృగాళికిన్ గనుఁ
కొంచముగల్గిన గల్గవచ్చుగా!
వారవధూటికిన్ వలపు
బాగుగఁ బుట్టినఁ బుట్టవచ్చుగా!
ఆరయ మృత్యుదేవత క
హా! కృపయుండిన నుండవచ్చుగా!
మారటతల్లికిన్ దయ సు
మంతయుఁ గల్గునె కల్లదెప్పఁగన్

అని వచించి యబలవోలె నాపోవ దొడఁగెను. రంగరావు తన బుద్ధికుశలతచే యతనిని వేరుప్రసంగములోనికి దింపి కొంత దుఃఖోపశమనముఁ గావించి యెద్దియో జ్ఞప్తికిరా, "మిత్రమా! అడుగమరచితిని. ఈమధ్య రాజసభామంటపమున నెద్దియో పందెము వైచితివఁట. సత్యమే నా?" యని యడుగ నాత డీవిధంబున బల్కెను. రంగారాయా! నీకాసంగతి తెలియదా? ఔను నీకెట్లు తెలియును. అవ్వాడు నీవు యాత్రార్థమై యూరు వదలియుంటివి కాదా? దాని వృత్తాంతమేమన

ఒకదినంబున మహారాజు సభాసదుల సమక్షమున "ఈకాలంబున నెచ్చటనైనఁ బతివ్రతాశిరోమణు లుందురా?" యని ప్రశ్నవైచెను. నేనంతటలేచి నాభార్య కలదంటిని. వెంటనే దివాను లేచి "కలియుగమున నేమి? పతివ్రత లేమి? అట్లైన్నటికిని కానేరదు. నీభార్య సతీమణి కాదని నిర్ధారణ చేయఁగలను" పల్కెను. మేము రువురము మొండివారలమై గొంతతడవు వాదించుకొంటిమి. అంత నాభూపతి సహస్ర రూప్యకలు బహుమతి చేతుననియు, వోడిన వారికి శిరచ్ఛేదనము గావింతుననియు తీర్మానించి మాకొక నెల గడువిచ్చి నాఁటికి సభ చాలించె. ఇప్పటి కిరువదియైదు దినములు గడచెను. నీతోఁ జెప్పమరచినందులకు మన్నింపు మని జరిగిన యావత్ వృత్తాంతముఁ దెలియఁ బరచెను.

ఇంతలో బ్రహ్మాజీరావు కుమారుఁడు రోదనము చేయుచు, తండ్రిని జేరి "నాన్నా! మాయమ్మ సన్నము పెట్టుమన కోపించి గట్టిగా నన్ను చరచి మిమ్మేలను పిలువమ" ని తగిలివేసినది. చూడుఁడు. నావీపుపై నెట్లుతట్టు తేరియున్నదో?" యని యేడ్వసాగెను. కుమారుని దురవస్థకుఁ దజ్జనకుండు చింతిల్లుచు "నాయనా! ఊరక డిల్లుము. మనవ్రాత యిట్లున్నది. ఏమి చేయఁగలము" ని బాలుని నోదార్చి నయనములనుండి బాష్పముల రాల్చెను.

ఇంకను జాగుసేసిన సవతితల్లి కోపించుననుభయమున స్నేహితుని బంపివైచి యాతఁడు కొమరుతో వెడలిపోయెను.

## 3

మహారాజుగారొసఁగిన గడు వతిక్రమించెను. నాఁడు రాజసభామంటపమున సభాసదులందరుఁ దమతమ యాసనములలంకరించిరి. అంత నా భూకాంతుఁడు దివానునుజూచి "ఓయీ! బ్రహ్మాజీ భార్య పతివ్రతకాదనుటకు తగిన నిదర్శనములఁ జూపగలవా?" యనెను. అనుటయు దివాను లేచి రాజా! నాఁటిదినమున తమసెలవు గైకొని పోయి బ్రహ్మాజీరావు గృహసమీపమున మారువేషముతో బస చేసితిని. ఇట్లుండ నొకానొక దివసంబున డాబాపైనుండి భారతి నన్నుగాంచి మోహించి నాకు పత్రమంపెను. ఆహా! "ఆపదబోప్రతీక్ష మెమ రాయెగదా?" యని సంతసించి దానామె చెంతకుఁబోయి నేటివఱకును హాయిగా నచ్చట కాలముబుచ్చితిని. పిదప నామె తన్ను మఱువవలదని జ్ఞాపకార్థము తన ముద్దుటుంగర మిచ్చెను. ఇంతేకాదు. ఇంకను పెక్కునిదర్శనములను చూపగల" నని భారతి వస్త్రాభరణములొక్కటొక్కటిగాఁ జూపఁదొడఁగెను. నాటినిగాంచి సభాసదులెల్ల రాశ్చర్యతమాపవిస్మితచిత్తులైరి బ్రహ్మాజీరావద్భుతపడి తెలతెలపోవఁ జొచ్చెను. అంతలో

నూరకొనక దివాను బ్రహ్మాజీరావుతో "అయ్యా! నీభార్య వక్షస్థలమున నొక మచ్చ గలదు. జ్ఞప్తికి దెచ్చుకొనుము. ఇంతను నీవు నమ్మకము చాలదేని మఱికొన్ని నిదర్శనములఁ జూపగలను" న బ్రహ్మాజీరావు లేచి వలదు. వలదు. నీ వేమియు జెప్పనక్కరలేదు. నేనే కండెమోసితి నని రాజసమ్ముఖమున నొప్పుకొని భార్యను భ్రష్టవర్తనకు కటకట పడఁజొచ్చెను.

ఉత్తముఁడగు బ్రహ్మాజీరావునకు సంభవించిన దురవస్థకు సభాసదులెల్లరు విచారింపసాగిరి. కాని దివాను సంతోషమునకు మేరలేదు. దయాస్వాంతుఁడగు నా రాజేంద్రుఁడు "అయ్యా! నీప్రాణముదక్క తదితరకోరిక గోరుకొనుము" న బ్రహ్మాజీరావు రెండుదినములుమాత్రము గడువు కోరుకొనెను.

౪

కోపనే బ్రహ్మాజీరావు వాక్కుపరుగున నింటికేఁగి తనభార్యను సంహరించు నూహతో శయ్యాగృహంబుఁ జేరి ప్రళయకాలరుద్రునివోలె నుగ్రుఁడై తన యొర యందమర్పఁబడినఖడ్గమును బయటకుఁ దీసె. అచ్చట నాయువతీలలామ యగు మహాపతివ్రత భారతి భర్తృపాదుకాపూజ సేయుచుండెను.

బ్రహ్మాజీరావు పతినూచి నివ్వెఱపడి ఆహా! ఈమె నాభాగ్యమో! నాభారతియే! ఇట్టి సతిమణినే యట్టి దుష్కృత్యమునకు బూనుకొంటినా? నన్నుఁజూడ! నమ్మజాల!" నని యుత్తమోత్తముఁ డగు నుర్వి నుంచిలో నైమఁగొని గిఱ్ఱుకున రాజసభకేఁగి రాజుంజూచి "మహాప్రభూ! నేనీయపవాదము భరింపఁజాలను! నా కిదియెల్ల నింద్రజాలమై ఘోషిల్లుచున్నది. కాన నేఁడే నన్నురి దీయుఁడని ప్రార్థించెను. కాని నా ధరణీధవుఁడు గడువుకానిదే యట్లు చేయజాలనని యెను.

౫

భర్తృపాదుకాసమర్చన నాచరించుచున్న భారతియొద్ద కొక చెలికత్తె వచ్చి "అమ్మా!" యని వెక్కి వెక్కి యేడ్చుచుండెను. ఏదో చెప్పఁబోయినను నోట మాట రాలేదు. అదిగాంచి యామె "ఏమే! యట్లు వాపోయెదవు! కారణమేమి? ఏదేని యుపద్రవము సంభవించెనా! నాకుమారుఁడేఁడే!" యని యాతురతతో నడిగెను.

చె—తల్లీ! బాబుగారికి గొప్ప... ...(అని యూరకుండెను)

భా—అయ్యో! నామనసు పరిపరివిధములఁ బోవుచున్నది. సమాచారమును సత్వరముగాఁ జెప్పవే!

చె—తల్లీ! అయ్యో! అయ్యగారికి గొప్ప యాపద సంభవించినది. రేపటి సాయంకాలమున వారిని ఉ—రి—తీ—సె—ద—రఁ—ట;

(సశేషము)

# మాతృభాషాసందేశము

[త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావుగారు]

(గతసంచికానుబంధము)

ఉ. వేడుకవేలు నాదునభి
వృద్ధికి వెచ్చముసేయు దాతనా
జాలికి జాలినొందు గుణ
శాలిమహోన్నతినేను బొందఁగా
మేలి ప్రయత్నముల్ సలుపు
మేటిమదాత్మభవుండు సూర్యభూ
పాలవతంసుఁ డెప్పుడును
ప్రాపయియుండఁగ నాకు లోపమే.

ఉ. ప్రాయము మీఱె విప్రుఁడవు
గ్రామ్యపుఁ బిచ్చికిఁ గొంతుకోయువ
ప్రాయుధ మేల పూనితి వ
యాయిదియొప్పు కృష్ణమూర్తిశా
స్త్రీ యిటు నేఁత భారతికి
తిక్కియు కెంతయు వంతరాయ మై
పోము నెఱుఁగ వో దుడుకు
పోకలఁ బోవుట నీకుఁ బాడియే.

ఉ. తిట్టిరి నిన్ను గ్రామ్యు లని
తేఁకువ లేక వాఁడెంత నీవు నం
దిట్టిన వారుఁ దిట్టుదురు
తిట్టులతోడన కాల మేఁగు నీ
పట్టినపట్టు సాగ నల
భారత మంతయుఁ జెప్పి కీర్తి చే
పట్టుము వ్యర్థవాద మప
వాదము పాల్పడకుం గుమారకా.

తే. బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి సలుపఁజేయ
బూనినట్టి విశ్వామిత్ర మౌని వోలె
భారతముమీఁద వేఱొక భారతమును
బూనుమీ కేటి కీ లేనిపోని గొడవ.

సీ. ఆంధ్రపత్రిక మన్ననాది పూర్వకవీంద్ర
భాషలో వ్రాయింప వచ్చునయ్య
భారతిలో "యెంకిపాట" లు ప్రకటింప
వల దంచు నుడిగింప వచ్చునయ్య
చిత్రోపచిత్రవిచిత్ర భాషల గ్రామ్య
కృతికల్ మాన్పింప వచ్చునయ్య
పాపపుంజములో లెబ్బలుచుండెడు పాడు
వాఙ్మయమ్ము నడంప వచ్చునయ్య

తే. యచ్చువచ్చకయున్న నాసేవపాచ్చెమయ్య
నిచ్చవచ్చినకైతలు పెచ్చు పెరిగెఁ
బట్టి విపరీతకాలమ్ము వచ్చియుండ
గ్రామ్యవిధ్వంసనము నీయఁ గలవె నీవు.

సీ. నామేలు మదిఁ గోరి నన్నుఁ బెంచినజగ
త్పావనీయుఁడు గజరాజు లేఁడు
నాకూర్మికొడుకు శ్రీనాథు నేలినమహా
దాత యావేమభూనేత లేఁడు
నాకేసుగడయునై నను లెస్సయని మెచ్చి
నట్టి శ్రీకృష్ణరాయండు లేఁడు
కవుల కేమఁగుపాడిగా నీవులిడి నన్ను
రహిఁ బెంచు రఘునాథరాజు లేఁడు

తే. ఎంచ లేదట్టి యాంధ్రభూమీశులిప్పు
డవనిఁ గల్గియు లేనియట్లైరి నాకు
నొక్కరో యుద్దతోఁ దక్క నుర్వి నాదు
గోల వినువారు లేరార కాలమహిమ.

క. నానవతి యాంగ్లభారతి
వేసము లక్షలక్షధనము వెచ్చింతురునా
కోసం బన మది నెంతయు
దోసముగా నెంతుకసుతుల నేమందున్.

సీ. మోటారుబండ్లకై మాటికిం జల్లు సొ
మ్మంత గాదందు నొక్కింత యైనం
బరదేశయాత్రకై పాఱబోసెడుద్రవ్య
మంత గాదందు గాసంత యైన
దొరలయిచ్చకపువిందులకునై చెల్లించు డ
బ్బంత గాదందు గోరంత యైన
సమితిమర్యాదసార్థమయితొల్లగెడుధన
మ్మంతగాదందు నావంత యైన

తే. నేమిపాపమొ నాకొఱకియ్యనెల్ల
రాంధ్రరాజుల యభిమాన మట్టిదున్న
దీసుతులలోన మతిభేద మిట్టు లున్న
దింక నెట్లున్నదో నాయదృష్ట మకట.

సీ. కాటుకకన్నీరు గాఱ నేడ్చెడునన్ను
నుపలాలనము చేసి యూఱడించెఁ
బరసేవకెంతొ దుంపలు దించు నడవిలో
మనుట శ్రేయంబంచు మదిఁదలంచె
బహుదరిద్రతను గీడ్పడియు నాసేవకై
తనజీవితంబెల్ల ధారవోసె
సంపదంధులకు నంజనము లేమియటంచు
నాత్మానుభవమునఁ దోరఁ జాటె

తే. భాగవతమును బాడి నన్ బ్రౌఢఁ జేసె
నట్టి నాకూర్మి నిఱుపేద కట్టిపంటి
కొడు కొకండైన నేఁడు నాకడుపునందు
బొడమునేనియు నాదుఃఖ మడఁగిపోదె.

తే. కూర్మికొడుకులు నీబోంట్లు కొందఱైన
జగతి నుండుట నీపాటి మిగిలి యుంటిఁ
బట్టి వజ్రాయుధం బింకఁ బాఱవైచి
భారతము వ్రాసికొమ్మహాపరము పొదవ.

తే. వాదసభ లేల యీప్రతివాదివక్తృ
దూషణము లేల యీపట్టిదోసఁగు లేల
నీవు నేర్చినభంగి నాసేవ చేసి
నాకు సంతుష్టి ఘటియింపవె కుమార.

తే. నాకు నుపయుక్తములగు గ్రంథములు నిలుచు
ననుపయుక్తంబు లగు కృతు లూఁగిపోవు
నెవ్వ రెట్లు వ్రాసికొన్న నాకేమికొఱత
వాఙ్మయంబెల్ల మత్స్వరూపంబు గాదె.

తే. నాదు హితవాక్యముల మది నాదరించి
లేనిపోని వివాదముల్ మాని పూని
నాదుసేవ సేయుఁడు కార్యవాదులగుచు
వాదశూరులు గాకుఁడు వత్సలార.

సీ. అజ్ఞానతిమిరసంహారి యగు నిర్బంధ
విద్యావిధానంబు విస్తరిల్లు
సకలవిద్యాశిక్షాసంపాది యగునాంధ్ర
సర్వకళాశాల సంఘటిల్లు
దేశసంఘాభివృద్ధి ప్రదాయక మైన
ప్రత్యేకరాష్ట్రంబు పరిఢవిల్లు
నౌన్నత్యకరమైన యభినవాఖిలశాస్త్ర
వితతార్థపరివృత్తి యతిశయిల్లు

తే. నాంధ్రమహి యెల్ల నామయంబై వెలుంగ
నెందు నేలోపమును లేక యే పెసంగి
జగతి నాపెంపు పెంపుగా నెగడఁగలను
వలదు సుతులార యావంతవంత మీకు.

సంపూర్ణము



# అన్యభాషా పదములు*

[పండిత పెనుమెత్స సత్యనారాయణరాజుగారు]

ఆంధ్రసాహిత్యపరిషత్తు అనఁగాన ఆంధ్రసాహిత్యమును వృద్ధిపఱచు సభయనియు, నందు సర్వాంగసంపన్నులగు పండితు లుండురనియు వారు భాషావిషయికమైన మనకుఁగలుగు సంశయములన్నియుఁ దీర్తురనియు నస్మదాదులగు నాంధ్రయువకు లనుకొనుచున్నారు. కారణ మేమన మున్నొకప్పుడు నేను 19 ఆగస్టు 22 సంవత్సరమున నామేట 2—3 తేదీలలోఁ బిఠాపురమున జరుగనైయున్న పరిషత్తును గోరుచు నాకుఁదోఁచినవిషయములతో "అన్యభాషాపదములు దేశ్యములగు నాంధ్రపదములతో పాటు ఏలవాడరాదు?" అని వ్రాసితిని. వ్రాయుటయే కాక గంపంత యాసతోఁ బరిషత్తు వారి తీర్మానములకై ప్రతిదినము రైలు స్టేషనునకుఁ బోయి యాంధ్రపత్రిక యాఱుకాను లిచ్చి కొని యన్యభాషాపదములను గూర్చిన తీర్మానము లెవ్వియైన నున్నవేమో యని చూచెడివాఁడను. నాతీర్మానము సరియే కాదా! మఱియొకతీర్మానమైనఁ గలదేమో యని చూడ నవియు గగనకుసుమములయ్యె. ఇట్లు విఫలమనోరథుండనై పరిషత్తు బాధ్యతాయుత ప్రభుత్వము కాదుకాఁబోలు నని యనుకొంటిని. రెండుమూఁడు సారులు సభలకుఁ బోయిన వారి నీవిషయములఁ గూర్చి యడిగితిని. వారు మహారాజావారి విందుల నారగించుటయే సభాతీర్మానము లనిరి. కాని నేను వారిమాటలం గీటునంబుచ్చి యొకచీరికిం గొననైతిని.

ఏలంటిరేని నిత్యప్రత్యూహారాహిత్యంబును మనస్సాహిత్యంబునునగు సాహిత్యంబు లేని నా వ్రాఁతలలోని శేతలంబట్టి పరిషత్తువారు ఈ లేఁబ్రాయంపుగవ్వల వ్రాతల కేమి యని త్రోసిపుచ్చిరి కాఁబోలు నని తలంచితిని. కాని నానతీర్థుండును సోదరుండు నగువాఁడు తూష్ణీంభావ మర్థాంగీకారమని యుక్తియుక్తముగఁ బలికెను. దానలాభ మేమి? నావిచారము తగ్గినది కాదు. అరణ్యరోదన మాలించువా రేరి? అని యనుకొనుచుండఁగా వారమ్మకడుపు చల్లఁగాను 16 నవంబరు 22 తేదీని శ్రీ పిరాట్ల సత్యనారాయణ యనువారు కృష్ణాపత్రికలోను, దుందుభిసంవత్సర ఆశ్వయుజబహుళ శనివారమునాఁడు ఆంధ్రపత్రి

* ఈవ్యాసము [illegible]లో జరిగిన ఆంధ్ర సాహిత్యపరిషత్తులోఁ జదువఁబడినది.

కా సారస్వతానుబంధములో శ్రీ చలికాని అప్పారావు, అనువారును, నావ్యాసమును విమర్శించిరి. ఇందు మొదటివారు "రాజుగారి వ్యాసాభిప్రాయములు సంస్తవనీయములే కాని దూరమాలోచింపక సుమారు రెండు మూడు వందల యేండ్లనాటి పదములను ఉదహరించిరి" అని యభిప్రాయమిచ్చి నిఘంటువులలో నన్యభాషాపదములు చేర్పవలసివచ్చునని భయపడిరి. రెండవవారు వ్యక్తిదూషణములకు దిగక "పిఠాపురసభలో నీవిషయము (అన్యభాషాపదములు వాడవచ్చున వాడరాదా?) చర్చకు వచ్చునను కొంటిని గాని రాలేదు. కాలము చాలలేదు" అని వ్రాసిరి. మా స్వనామధేయులగు సత్యనారాయణగారికిఁ దమ సుమారు పంటిపదములు వాడుటయే నా యభిప్రాయమనియు, నిప్పటికిఁ బదియవ కూర్పునకు సిద్ధముగా నున్న శబ్దరత్నాకరము దృష్టిపథంబునఁ బడమికేవిచారము, అనియు సమాధానము వ్రాసితిని. అప్పటి కంతలో నావాదము ముగిసినది.

పదపడి యన్యభాషాపదములను గూర్చి యీయేటి యుగాది సంచికకు నొక విపులవ్యాసము వ్రాసి పంపఁగా వారు ప్రచురింపెదమని ప్రత్యుత్తరము వ్రాయుచునె పరిషత్తువారివలెఁ ద్రోసిరాజని చేమకూరపాకమును జ్ఞప్తికిం దెచ్చి కొంత కాలమున కేమిదోఁచినదో సారస్వతానుబంధములోఁ బ్రచురించిరి దేవుఁడు వరమిచ్చిననుఁ బూజారి యనుగ్రహింపవలయును గదా!

సదస్యులారా!

ఇది యంతయు నప్రస్తుతము కాని కడుపుమంట యాఁగినదికాదు. పండితులు క్షమింపఁ బ్రార్థితులు.

ఘృతమునకుఁ బాత్రమునకు నట్టి యవినాభావసంబంధమో సంఘమునకుఁ భాషకు నట్టి సంబంధము కలదు. కనుకనే సంఘాభివృద్ధితోపాటు భాషాభివృద్ధి కావలయును. ఏయొక్క భాషయైన అభివృద్ధి చెందవలయు నన్న అవసరమును బట్టి తగిన మార్పులను జేసికొనక తీరదు. మనుష్యమాత్రుని సర్వవ్యవహారములు వాక్కుచే నడచుచున్నవి. ఒకనియూహను మఱియొకనికి నెఱుకపఱచుటకు శబ్దమువంటి ముఖ్యసాధనము వేఱొండు కానేరదు. అట్లు కావుటం జేసియే, యేయేశబ్దములుచ్చరించుటచే మన భావములను నెదిరికి నెఱుకపఱుపఁగలమో యాయా శబ్దములు అన్యభాషలోనివి యైనను వాడుటయే భాషాభివృద్ధికి ననుకూలము.

ఛందస్సున ననుపది గూఢము. ఛందస్సున నగునంతమాత్రమున పండితులు భాషావిధ్వంసకునిగా నన్ను దలంచెదరేమో? గీర్వాణభాషితంబగు గైర్వాణి వాణి సంస్కృతంబగునప్పటికిఁ బూర్వపు

వాఙ్మయమున్న నారసితిమని పండితులకుఁ గోపము కలిగియు నయ్యది యనుగ్రహముగా మారక మానదు.

'సంస్కృతస్య సంస్కృత్యపదాని ప్రయుజ్యంతే' అని పతంజలి మహాభాష్యమున వక్కాణించినట్లు వర్ణలోపాగమాదేశాది పదప్రత్యయంబులచే సంస్కృతమైన సంస్కృతభాష విజృంభించినపుడు అనేకాన్యభాషాపదములు దేవభాషలోఁ జేరియుండుట వాని స్వీయ ద్రావిడ సహజనధాతువులవలనఁ దేటపడుచున్నది. ఇటీవల భాట్టకాండే యనువరియొకఁడు తమిళపదంబులు చేర్చుకొనఁబడెనని వ్రాసియుండుట గమనించినఁ దెలియనగును—

| తమిళము | సంస్కృతము |
|---|---|
| ఇడై | ఇడా |
| పిన్గలై | పింగళా |
| సుళిమునై | సుషుమ్నా |
| నారత్తై | నారంగః |
| మెళుకు | మ్రుదు |
| పవళ | ప్రవాళః |
| పిణ్ణాకం | పిణ్ణాకః |
| పిటల్ | పిష్టః |
| పడికం | స్ఫటికః |
| కుట్టం | కుష్ఠః |
| తమిళం | ద్రవిడం |
| తిప్పిలీ | పిప్పలీ |

| తమిళము | సంస్కృతము |
|---|---|
| కురుప్పం | గర్భః |
| నిలై | నిలయం |
| నీర్ | నీరం |
| మాదం | మాసం |
| మీన్ | మీనం |
| తామరై | తామరసం |
| పుడవి | పృథ్వీ |

ఈశబ్దముల మార్పునుబట్టి సంస్కృతశబ్దార్థము తెలిసికొనుట సుగమము. ఇట్టి శబ్దము లెన్నెన్ని సంస్కృతభాషలోఁ జొచ్చినవో! భావివిమర్శకులు తెలియఁగలరు. దేవభాషయు, విపులవాఙ్మయంబు నగు సంస్కృతంబునకే యింతటి మార్పులొసఁగి యన్యభాషాపదములు పాదుకొనియుండఁగా మిక్కిలి చిన్నదియగు మన యచ్చతెలుఁగులోనికి నెన్ని యన్యభాషాపదములు సొచ్చియున్నవో! సామాన్యముగా తమిళములోనుండి తెలుఁగులోనికి వచ్చినవో తెలుఁగునుండి తమిళములోనికిఁ జొచ్చినవో తెలియని శబ్దంబులఁ గాంచుఁడు-

| తమిళము | తెలుఁగు |
|---|---|
| కై | కై |
| కాడు | కాడు |
| ఉప్పు | ఉప్పు |
| నాడు | నాడు |
| ఉఱువి | ఉఱువి |
| పకల్ | పగలు |

| తమిళము | తెలుఁగు |
| --- | --- |
| పురి | పురి |
| అంబు | అంబు |
| కత్తి | కత్తి |
| పో | పో |
| ఇల్ | ఇల్లు |
| పాల్ | పాలు |
| సీర్ | సీరు |
| పోర్ | పోరు |
| ఎద్దుం | ఎద్దు |
| చేర్ | చేరు |
| కలంగు | కలంగు |
| ఆఱు | ఆఱు |
| నూఱు | నూఱు |
| తోల్ | తోలు |
| ఇల్లాళ్ | ఇల్లాలు |

| తమిళము | తెలుఁగు |
| --- | --- |
| కారం | కారము |
| అఱుపది | అఱువది |

ఇంకను ఇట్టి మార్పులు వర్ణవ్యత్యయ వర్ణలోపాగమంబులు గలిగిన తమిళ శబ్దములు కుప్పలు తెప్పలు. ఈశబ్దము తమిళమునుండి తెలుఁగులోనికి వచ్చినవని అఱవవారందురు. లేదా మా తెలుఁగు నుండి యీయఱవములోకి వచ్చినవని తెలుఁగువారందురు. ఏదియెట్లున్నను తమిళ శబ్దంబులు సంస్కృతములోనికే చొచ్చియుండుటంజేసి తమిళభాష ప్రాచీనభాషయనక తీరదు. అప్పుడు అఱవవారివాదము నిజముగాక మానదు. ఈ పైనిఁజూపిన శబ్దములన్నియు విచ్చలవిడిగా మన యాంధ్రకవులచేఁ బ్రయోగింపఁబడ్డవి.

(సశేషము)

# కవిత్వమర్మము

[తుర్లపాటి గోవర్ధనరావుగారు, సారస్వతసమాజము]

కవికి సమంబు లేదు త్రిజగమ్ముల సృష్టికళావిభూతి కాం
డవ యజుఁడన్న లెజ్జ వచనానుమతిన్ శిరసావహించి మా
నవ కవితాకుమారికి తృణతృణమా వయిపూత గోత్రి శే
బవలు తపింపలేదు కవి; పండిత! నైజమసీమ యాటచేఁ! 1

శారద సాంద్ర చంద్రికల ఛాయలు, బర్హిణకాంగనా పరీ
వారము పూవనాలు, కలువల్ జలదమ్ములు నెల్ల మాకలం
కారము తాను గానలోనంగం బసిచేయు; కవిత్వవాణి కే
వ్వారలు నాసఁజేయుఁగ, దవానల మీను నటంట! వింటిరే!॥ 8

పుటలను సత్య సూక్తులను మున్ లిఖియించి విధాత పుస్తక
మ్ములకుల నొసంగఁ జూచి మనమీగతి మౌనము దాల్చియుంట నం
కట మగుఁగాదె? లోకమున; కర్హాంగల్గు జనమ్ము వ్రాసి వే
యుట " మన కేమి కొట్టినని " యొప్పినమానె, సుధీంద్ర పాళికిన్! 9

నన్నయ తిక్కనాద్య కవినాథులు మున్ను గ కల్గువారు మున్
చన్న విధమ్ములారసి వెనన్ యతి ప్రాసలకై పదాళికై
తన్నుక చావనోసి కవితన్ రచనమ్మొనరించు నేర్పు వి
ద్వన్నుత! శారదమ్మ! మదుపాస్త్య! దయన్ లభియించు టబ్రమే? 10

---

# ఆంధ్ర సారస్వతము

[అయ్యంకి సోమయాజులు వెంకటసుబ్బారావుగారు ఎం. ఏ. ఎల్. టి.]

(గతసంచి కానుబంధము)

నాచనసోముఁడు ఉత్తరహరివంశమును వ్రాసెను. ఈకవికి సర్వజ్ఞబిరుదము లదు. ఎఱ్ఱాప్రెగడ చేసిన హరివంశము ప్రౌఢముగా నుండలేదన్న యభిప్రాయముతో నీతఁడీయుత్తరహరివంశమును రచించినట్టు కాన్పించుచున్నది. కవిత్వమందే గాదు ఇద్దఱకు లభ్యమైన మాతృకలలో కమున్నది. ఆనవవరపు గోడపలు శంభుగామునకు దొరకిన పుస్తకమం దున్నవి.

నాచనసోమన కవనమందు క్రొత్త క్రొత్త త్రోవలను త్రొక్కెను. సీసపద్యముల కీతడు పెట్టినపేరు. అంత్యానుప్రాసములను తఱచుగా నుపయోగించును. దేశీయపదములు లోకోక్తులు ప్రాయికముగా వాడును. కథారంగమునందియు క్రొత్తమట మున్నట్లు శబ్దముల నుపయోగించును. చతుర్థాశ్వాసమున హంసడింభకులు దుర్వాసు నధిక్షేపించు ఘట్టమున—

కావిచీరముసుంగు కచ్ఛపంబునుజూచి బోడతలయు విమద బొట్టుఁజూచి। గోచి తోఁగి వెదురుకోలయుఁ జిక్కంబుఁ గట్టి యున్న బుఱ్ఱకాయజూచి॥ మిడికెడిఁ బెదవులు వ్రేళుఁబు। మడిగెడుఁ గనుదోయి మొగిడ మాయెదురఁ గదుర। బెడవీఁక యొడలు చేసెడు। కడవల జపమునకు నేఁడు గిలదో లేదో॥ తిఁసినకూడుదెచ్చి నలు దిక్కుల బోడలు తిండిపెట్టఁగాఁ। జెఁగిన పొట్టపోడ నొక పీఁటవయిం దొరవోలె నెవ్వరిఁ। నరకుగోనంబు వట్టుకొని చాఁ గఱగొన్న బలేమెఱుంగుడ। కర్రి బలు మోపు మోచు నయగారి తనం బది యుట్టిగట్టినఁ॥ వస్త్రాఖ్యానమున కుమారస్వామి యుద్ధఘట్టపు "ఇవ్విధంబుననగుహజ్వరుండై" అను వచనమున శ్లేషానుప్రాణితోపమోత్ప్రేక్షాలంకారముల నుపయోగించెను.

సోమన వచనరచనయందు బాణు ననుకరించును. వచనమున యమకము, అనుప్రాస వాడును. దీర్ఘ సమాసములను వాడుటలో నాచనసోమన కెవరును సరి రారు. సర్వజ్ఞుఁడు సర్వతోముఖ పాండిత్యముగల కవిశ్రేష్ఠుఁడు

సోమనాథునకు జోడగుకవి శ్రీనాథుఁడు కవిసార్వభౌమ బిరుదమును పొందిన ధీశాలి. మరుత్రాజచరిత్రము పండితారాధ్యచరిత్రము శాలివాహనసప్తశతి నైషధము భీమపురాణము కాశీఖండము హరవిలాసము మొదలగు గ్రంథములను రచించెను. శ్రీనాథుని గ్రంథము లన్నిటిలోను నైషధము ప్రౌఢకావ్యము. శృంగారరసప్రధానమైనది. సంస్కృత సమాసములకు డుమువులు చేర్చుచే గాని ఆంధ్రీకరణములో వన్నె తేలేదనెడి వదంతి యొకటి కలదు. ఆంధ్రీకరణమున సంస్కృతకావ్యమునకు వన్నెతెచ్చెను. తర్జుమాచేసి మెఱుగుతెచ్చుటకు వీలులేని సంస్కృతసమాసముల నట్లె ఉపయోగించెను. వీనిని తెనిగించుట దుర్లభము ఒకవేళ ఆంధ్రీకరించినను సరిగా తెనిగించుట కష్టము. విద్వదౌషధ మగు నైషధము తెనిగింపబూనిన కవి కీమాత్రపు విషయము తట్టియుండక పోదు. శ్రీనాథునకు నైషధముపై ప్రేమ హెచ్చు. గ్రంథము లెన్నియో రచించినను "ఆంధ్రనైషధ కర్త యని" తనవిషయమై గొప్పగా చెప్పుకొనెను.

శ్రీహర్షుని కావ్యములోని పచ్చి శృంగారమును విడచిపెట్టెను. నలచరిత్ర నంతయు వ్రాసిన ధీరోదాత్తుఁడగు నాయకునకు రాజ్యభ్రష్టము నైచ్యము వాటిల్లునని కళ్యాణములోనె ముగించి నాయక పాత్ర పోషణము చేసెను. కొన్నిచోట్ల మూలముకంటె రసవంతముగ నాంధ్రీకరించెను. శ్రీనాథుని నైషధము నిర్దుష్టమగు ఆంధ్రీకరణము. అలంకార భూ

యిష్టము. శైలి చక్కగానుండును. శాస్త్ర పద్యములు పెద్దవారులచే అనుకరింపబడినవి. ఉదాహరణములు ప్రసిద్ధములు.

శ్రీనాథుడు వీథినాటకమును రచించెననెడి ప్రతీతి కలదు. వీథినాటకమందు వస్తువు సమగ్రముగా లేదు. రూపక లక్షణములు వర్తింపవు. నాయకుడు లేడు నాయికలు పద్యమున కొకరు. రసము శృంగారరసము. అంతయు స్త్రీవర్ణనయే నాటకనామము దీనికి వర్తించదు. కాబట్టి ఇది శ్రీనాథ కృతమగునా?

కవిసార్వభౌముని బావ సహజ పాండిత్యభాషా విశారదుడగు పోతనామాత్యుడు రామచంద్రసేవాధురంధరుడు పరమభాగవతోత్తముడు. భాగవతమును సమగ్రముగా తెనిగించిన కవి. నరాంకితముచేయక తనగ్రంథమును శ్రీరామున కంకితమిచ్చెను. పోతన సికేతనస్థానపు సర్వయు లాక్షణికకవియగునా అనెడివాదమును శ్రీ మన అగ్రాసనాధిపతిగారె పరీక్షింతురు. ఆధ్యాత్మికవిషయభూయిష్ఠమగు భాగవత మందజనుల ఆకర్షించుటకు కారణము పోతనశైలియే. పోతనశైలి అంత్యానుప్రాసములో నిండియుండి భక్తులు భజన చేసికొనునపుడు లయయుక్తముగ పాడుటకుగూడ వీలైనది. భాగవతము పోతనయే తెనిగించడేని ఇంతమాధుర్యముగా నుండదు. కాని పోతన కృతభాగవతములో కొన్ని భాగములు లుప్తమ్ములు కాగా నారనామాత్యుడు పూర్తిచేయుట తటస్థించెను. కాని బాణాసురయుద్ధ ఘట్టమున ఈశ్వరనామగానము చేయనందుకు వీరభద్రవిజయము పోతన రచించుట తటస్థించెనట. భోగినీ దండకమును పోతనయే వ్రాసెనట. శైలి పోతనశైలివలె నున్నను భాగవతోత్తముడు మనుజేశ్వరాధముల కంకిత మీయని మహనీయుడు నాయకాంతపై వ్రాయునా యనెడి యనుమానముండుట సహజము.

అనంతామాత్యుడు భోజరాజీయము రసాభరణము ఛందస్సు వ్రాసెను. విక్రమార్కచరిత్ర కర్త జక్కనకవి. పినవీరన జైమినిభారతములోని అశ్వమేధపర్వమును తెనిగించెను. శకుంతలాపరిణయమును వ్రాసెను.

శకుంతలాపరిణయమున పినవీరన భారతకథ నంతగా ననుకరించలేదు. కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలమును కొంతవరకు అనుసరించెను గాని స్వకపోలకల్పనలుకూడ చేసెను. ప్రబంధమగుటచేత మార్పులు చేయవలసి వచ్చెను. సూర్యోదయము చంద్రోదయ వర్ణనము ధోపాలంభన చంద్రనింద యుద్ధము మొదలగునవి చేర్చెను. దుష్యంతుడు సప్తదివసములు కణ్వుని ఆశ్రమమున ఉండుట దుష్యంతుని శకుంతలాపునఃపునః సమావేశంబు దానవులతోడి యుద్ధము ఋషీశ్వ

పెద్దనకాక ముక్కు తిమ్మనయు రాయల ఆస్థానమున గలడు. తిమ్మన పలుకులు ముద్దులొలుకును. పారిజాతాపహరణములో మొదటి రెండాశ్వాసములలోని కవితాకీర్తి తెలుపుట లేదు. అంతకంతకు శైలి కఠినము. ధూర్జటి కవిత్వము అతులిత మాధురీమహిమ కలది. సంకుసాల నృసింహకవి శృంగార వైరాగ్యములను చక్కగా వర్ణించగల నేర్పరి. రామభద్రుని కవనము రసవంతము గాని యుండును.

పింగళి సూరన మహాకవి. తెనుగు వాఙ్మయమున క్రొత్తత్రోవలు త్రొక్కెను. రెండర్థముల కావ్యమును వ్రాసెను. కల్పిత కథను వ్రాసెను. కళాపూర్ణోదయము చక్కని కావ్యము. ప్రభావతీ ప్రద్యుమ్నము కళాపూర్ణోదయమునకే సరి. సూరన విషయమై చాల చెప్పవలసియున్నను అవకాశము లేకుండజేసి విడచెదను.

రామరాజభూషణుని వసుచరిత్ర ప్రౌఢగ్రంథము. శ్లేష ప్రధాన కావ్యము. వసుచరిత్రకంటె పలుత్వముగా నుండుటకు కవి యావచ్ఛక్తి ధారపోసి వ్రాసిన గ్రంథమని పద్యములు చెప్పుచునే యున్నవి. వసుచరిత్రమున కవితను పాండితీమహిమను కవినైపుణ్యమును సమగ్రముగా జూపెను. కొన్నిచోట్ల శ్లేష ఎరుపు తెచ్చినట్లుండును.

రామరాజభూషణుని యనంతరమున ప్రసిద్ధికెక్కిన కవు లున్నను ఇంతతో విరమించి ప్రస్తుతవాఙ్మయమునుగూర్చి ఆలోచించుట అవశ్యకర్తవ్యము.

11—15 శతాబ్దములలో రమారమి 40 కవులు గలరు. 50 గ్రంథములు కలవు. దీనికి పురాణయుగమని మొత్తముమీద అనవచ్చును. పురాణములు గణితగ్రంథము ఛందోవ్యాకరణములు అలంకార కావ్యములు సాహిత్యము ప్రబంధములు వెలువడినవి.

ఈకాలమున 90 కవులు. నూటికి పైచిల్లు ప్రబంధములు లేవు.

16—17 ప్రబంధయుగము. పింగళి సూరన నన్నయచే ప్రారంభమయిన సౌధనిర్మాణమును పూర్తిచేసెను.

18—19—140 పైన కవులును 200 లకు పైన గ్రంథములు కలవు. శబ్దాలంకారములు గల చిత్రప్రబంధములు బయలుదేరిన కాలము. రెండర్థములు మూడర్థములుగల కావ్యములు రచింపబడినవి.

నవీనయుగమున వాఙ్మయాభివృద్ధి కలదు. పలురకముల గ్రంథములు వ్రాయబడినవి. పాశ్చాత్యనాగరికత వాఙ్మయము విదేశగమనము శాస్త్రపరిశోధన హెచ్చింద వులకు లభించినవి. భావవికాసము కల్గినది. స్వాతంత్ర్యము సమత్వబుద్ధి సౌభ్రాత్రము వృద్ధిపొందినవి. వార్తాపత్రికలు మాసపత్రికలు ప్రకటింపబడుచున్నవి.

వచనగ్రంథములను ఆంధ్రులు వ్రాయ నారంభించిరి. పూర్వులంతగా వచన విషయమై ప్రయత్నించలేదు. లక్షణగ్రంథములను పద్యములలోనే వ్రాసిరి. సంస్కృత వచనగ్రంథములనైన పద్యకావ్యములుగ వ్రాసిరి. నాటకములను కూడ ప్రబంధములుగనే వ్రాసిరి. బాలసరస్వతి రంగకౌముదీనాటకమును వ్రాసెనట.

"గద్యంకవీనాం నికషం వదంతి" అను పండితోక్తి ననుసరించి గద్య వ్రాసిన కవి పద్యము వ్రాసిన కవికి తీసిపోడు. ఆంగ్లమున ప్రోజుపోయిట్రీ అనబడు గద్యకావ్యములు కలవు. నన్నయాదుల వచనములు వర్ణనలపట్ల ఉండును. సోముని రచనములలో గాంభీర్యముకలదు. శుద్ధాంధ్రపదభూయిష్ఠములై యమకానుప్రాసయుక్తములై సోముని వచనము లుండును.

శ్రీనాథుని వచనములు నన్నయ వచనముల బోలియుండును. పోతనవచనములు దీర్ఘములు. పెద్దనాదులువచనముల నంతగా వ్రాయరు. వ్రాసినను వర్ణనల కొఱకు వ్రాయుదురు.

దొడ్డరాజపుత్రుండగు వీరరాజు వచన భారతమును వ్రాసెను. ఆంధ్రమహాభారతమున కిది దండాన్వయముకాదు. పలువుర కుపయోగించునట్టుల వ్రాయుటయే కవియొక్క ముఖ్యాభిప్రాయము. నారాయణకవి శాంతిపర్వమును అనంతభూపాలుడు అనుశాసికపర్వమును వచనముగ వ్రాసిరి. అనంతభూపాలుడు విష్ణుపురాణము భగవద్గీత వ్రాసెను. సంజరాజు విష్ణుభక్తివిలాసము హాలాస్యమాహాత్మ్యమును, హరిభక్తివిలాసము కాశీమహిమార్థదర్పణమును వ్రాసెను. వేంకటకృష్ణప్పనాయకుడు జైమిని భారతాంతర్గతాశ్వమేధపర్వమును వచనముగా వ్రాసెను. విజయరంగ చొక్కభూపాలుని కాలమున భారత భాగవత రామాయణములు వచనకావ్యములుగ వ్రాయబడినవి. పుష్పగిరి తిమ్మన భాగవతసారమును వ్రాసెను.

ఆచార్యవిజయము బలభద్రవిజయము బ్రహ్మవిద్యాసుధార్ణవము మైరావణచరిత్ర, వివేకచూడామణి వివేకసారము వచనకావ్యములే. భారతసావిత్రి అందఱకును తెలిసినదె. గోవ్యాఘ్రచరిత్రమును వచనముననే యున్నది.

చిన్నయసూరి హితోపదేశమును వచనముగ వ్రాసెను. కాని ఈ వచనమునకు ధారాళమగు నడక లేదు. మాటలను విరి వ్రాసిన ట్లుండును. వీరేశలింగముగారి వచనములు విగ్రహమువలెప్పుధారాళమగు నడక గలిగి యుండును. ఆధునికులలో వీరేశలింగముగారి వచనములు ప్రసిద్ధికెక్కినవి. ఆధునికయుగమున వీరేశలింగముగారు సారస్వతమున క్రొత్తమార్గములను త్రొక్కిరి. గద్యకావ్యములను వ్రాసిరి.

ఆంధ్రవాఙ్మయమును విమర్శించి కవుల చరిత్రమును వ్రాసిరి. ఆంగ్ల సంస్కృత నాటకముల నాంధ్రీకరించిరి. నవీనయుగమున కీయన మార్గదర్శి. "పశుశ్రీవిశేష దుర్లభ స్సకలస్యన్యత్కృత్య వర్త్మనః" దారిచేసిన అనంతరమందఱు చెప్పనారె కాని దారితీయు నతడె యావశ్యకము. వీరేశలింగముగారు ఆంధ్రవాఙ్మయము నభివృద్ధి గావించి ఆంధ్రులకు మహోపకారము చేసిరి.

గురజాడ అప్పారావుగారును తిరుపతి వేంకటేశ్వర ప్రభృతులు వివిధములగు గ్రంథములను వ్రాసి వాఙ్మయాభివృద్ధి చేసిరి.

అప్పారావుగారు విమర్శకులు. కన్యాశుల్కమనెడి సాంఘిక నాటకమును వ్రాసిరి. ప్రస్తుత మాంధ్రబ్రాహ్మణుల నచ్చటచ్చట బాధించుచున్న కన్యావిక్రయము నాక్షేపించుట ఈగ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. ఇంతియకాక ఇప్పటి భాషాస్థితి గ్రాంధికభాషలో చేయవలసిన మార్పులను సూచించుట కూడ వీరి యభిప్రాయము. వీరికవిత్వము మాధుర్యముగా నుండును. ఆంగ్లవర్డ్సువర్తు అంతటివాడు. భావగంభీరములగు చిన్న పద్యములను వ్రాయుటలో ఘనుడు. ఆంగ్లభాషావిశారదుడు.

తిరుపతివేంకటేశ్వరులు జగత్ప్రసిద్ధులు. వీరె కాక మఱికొందఱు భాష నుద్ధరించిరి. వీరందఱును పూజ్యులె.

ప్రబంధములె కాక నవలలు నాటకములు బయలుదేరినవి. నవలలు నానాటికి పెరుగుచున్నవి. అన్ని భాషలనుండి పరివర్తనములుగలవు. పరివర్తనమునకుజ్జు మాఱుగలవు. నవలసిన మొదట గొప్పగా నుండెడిది కాని ఇప్పుడు గనవంశమగునవి అంతగా పెంపవడలేదు. నవల విమర్శనాస్థానములు బయలుదేరినవి. ప్రతి యింటిలోను పత్రికలు తయారగుచున్నవి. క్రొత్తఅలంకారములు అద్భుతోపమలు సృష్టింపబడుచున్నవి "నాయకయుని జ్వరమునకు క్వైనైనువంటిది వాతమునకు వాతరాతిసమువంటిది. పెట్టెకు తాళమువంటిది" అని రజని యందు గలవు. ఎంత పరివర్తనమయినను చెవి కింపులేనివి విడువ కూడదా? ప్రస్తుతమాంధ్రదేశమున నవలలు కుప్పలుకుప్పలుగ నున్నవి శ్రీయుత రామమూర్తిగారు చెప్పినటుల తెలుగు వ్రాయగల ప్రతియాంధ్రుడును నవలలను వ్రాయుచున్నాడు. రానురాను నవలలు నిస్సారములగుచున్నవి. ఇట్టివి వాఙ్మయమున నెంతకాలము సజీవములైయుండునో?

(సశేషము)

# అనుకూల దాంపత్యము

[అనుముల వేంకటశేషకవిగారు]

(గీతములు)

౧

"పెండ్లి" యనిన, "తద్దినమున పెట్టెద" యను
కరణిఁగాక పాలును నీరుఁ గలసినంగు
కరణిఁ జేదోడు వాదోడుగాఁ జరించు
వారిదే యనుకూల దాంపత్యమనిన.

౨

పురుషుఁడని భార్య భయమును బొందరాదు;
భర్త భార్యను వనితని బాదరాదు;
స్నేహితులు సోదరులకున్న చెలిమియట్లు
వరలునదె యనుకూల దాంపత్యమనిన.

౩

ఏ సమయమందు నే కార్యమేమి సేయ
నెంచినను గూడ నొండొరు లంచితంపు
కరణి యోచన మొనరించి కడకు చక్క-
వరచునదె యనుకూల దాంపత్యమనిన.

౪

భార్య భర్తను భగవంతు పగిదిఁ జూడ,
భర్త భార్యను భక్తురాలి పగిది జూడ
వలయు; తగినట్లు గౌరవఘనతఁ దాల్ప
వలయు; నదె యనుకూల దాంపత్యమనిన.

౫

గృహమునకు ద్వారమున్నట్టు లిహపరంబు
లకు నిజార్ధాంగి యగునంచు లలితరీతి
బాల్యమున నెంచి పురుషుండు భార్యప్రేమఁ
బడయునదె యనుకూల దాంపత్యమనిన.

౬

పితరు లాచరింప నాడిన పెండ్లికార
ణమున నే గాక రూపగుణముల చేతఁ
గూడ ప్రేమించియుండొరుల్ కూర్మి వెలయ
వలయునదె యనుకూల దాంపత్యమనిన.

౭

పూవుఁ దావియు విడనాడిపోనిరీతి;
నూట నీరును సెలయేటి నుండు భాతిఁ
నెడము గాక యొండొరులు నీడ జోడు
వడయునదె యనుకూల దాంపత్యమనిన.

౮

ఒండొరులఁ గౌగిటకుఁ దార్చియొకరు వగము
కోరికీయుడ, దానినొక్కరు కోరికొనుము;
వేరుబంధ మెఱుంగక ప్రేమసుఖముఁ
బడయునదె యనుకూల దాంపత్యమనిన.



# సాహిత్యమీమాంస

[శ్రీపాద కామేశ్వరరావుగారు ఎం. ఏ. ఎల్. టి.]

## హిందూకుటుంబ నియమములు

ఆర్యసాహిత్యమున రచింపబడిన ప్రేమాదర్శములయందలి నాయికానాయకులు పరస్పరము "నేను నిన్ను వలచు, ప్రమాణముచేసి చెప్పుచున్నాను, నిన్ను తప్ప అన్యుల దలంపను; ముమ్మాటికి ఇది నిజము, నీ వొకక్షణ మగపడకున్న నా గుండె పగులును, ప్రాణములు నన్ను బాసి పోవును" అని సంభాషించుట కానరాదు. ఇట్టి క్రయవిక్రయసామగ్రి రూపమగు ప్రేమ హిందూకుటుంబములందు పొడసూపదు. తత్సంఘనియమానుసారము ఎవరికేది కర్తవ్యమో వారు దానిని ఫలాపేక్షలేకయే నిర్వర్తింపవలయును. అట్టి కర్తవ్యపాలనమున యావత్స్నేహము, మమత, దయ, దాక్షిణ్యము, భక్తి, ప్రేమయు ప్రకటితమగును. వివాహభారము మాత్రమే పెద్దలది కాని తదనంతరము భార్యాభర్తలకు వారివారి విధులు సంక్రమించును. రూపపిపాస, ఇంద్రియలాలసయు చరితార్థ మొనర్చుటయే వివాహమునకు ముఖ్యోద్దేశము కాదు. కావున వివాహము వధూవరుల వశమున నుండదగు పని కాదు. తలిదండ్రులో, ఇతరాభిభావుకులో, తద్భారమును వహింప నర్హులు. పతియాజ్ఞకు సతియు, సతియాజ్ఞకు పతియు బద్ధులై యుండవలయు నను కుటుంబనియమమునకు వధూవరులను అన్యోన్యబద్ధుల చేయుటకే వివాహము కల్పింపబడినది. సత్ప్రతిపాదకమగు ఈ సాంసారిక శృంఖలమున వారిని త్వరలో బద్ధుల జేయుటకు పిన్నవయసునచే బాలికాబాలకులకు వివాహ మొనర్తురు. అనంతరము యౌవనస్రోతము ప్రవహించి రిపుషట్కము ప్రబలమగునప్పటికి స్త్రీపురుషులు సంసారశృంఖలాబద్ధులయ్యెదరు; ఆ సంకెలల తెంచుటకు తగిన సామర్థ్యము వారి కలవడదు. అన్నివైపుల ఆలానములే. వాటి నూడబెరుకుట సామాన్యులకు సాధ్యము కాదు. పరమభాగవతు లట్లు చేయజాలుదురు. కాని తదితరుల కది చేతగాదు. ఇట్టి నిర్బంధమే లేకున్న హిందూకుటుంబము లోకమునకు ముందరికి వేయజాలవు. యౌవన మంకురించిన తోడనే స్వేచ్ఛాచార మలవడుట హిందూసంఘమునం దసంగతము. ఇట్టి కట్టుబాటులతో విలసిల్లు సంఘమున ప్రేమను టండోరావేసి చాటుటెట్లు? అది బాల్యమున తనంతనే ఆవిర్భవించి గృహస్థాశ్రమమున వెలుగొంది, సంఘనియమానుసారము పెంపొంది, సంసార మహోద్యమమున సంపూర్ణవికాస మొందును. అనగా దంపతీప్రేమ కాలక్రమమున నంకురించి పతీ

పత్నులు నిరంతరము కలసిమెలసి యుండుట వలనను, గృహకృత్యములు నిర్వహించుచుండుట వలనను, సంతానమును కని పెంచుచుండుట వలనను క్రమేపి పెంపొందును, బాహ్యసౌందర్యము సాంద్రమైన కొలది మమత హెచ్చి, రోగము, శోకము, సేవ, యత్నము మొదలగు వాటిచే పరిపూర్తి చెందును. ఇట్టి ప్రేమ ఒకటి రెండు వత్సరములలో అంతరించునది కాదు. యూరోపియను వాగువంటి వలయును.

యూరోపియను సంఘములలో పెట్టుండను. స్త్రీపురుషులు యౌవనవంతులగు దాక వారికి వివాహము కాదు, సాంసారిక ధర్మము లుండవు; స్వేచ్ఛామతులై వారు జీవనములు గడుపుచుందురు. ఇంద్రియలోలుర వారియందు ప్రబలముగ నున్నను దానికి తగిన వ్యవస్థ లేర్పడియుండవు. కుటుంబనియమ బంధనములు లేవు, ప్రాముఖ్యముగా ధర్మముకాని కర్తవ్యజ్ఞానము కాని లేవు; ఉండినను అపకార్యాచరణీయములు కానందున జనసామాన్యమునకు ఆత్మశాసనమున స్థైర్యమలవడదు. అందుచే యౌవనప్రవాహమున కొట్టుకొని పోవుచు ఎవ్వరెట తేలుదురో ఎరుంగరాదు. హిందూసంసార నియమముల పోలు కట్టుబాటులు దృఢముగా నుండని చోటుల యువకులు స్వేచ్ఛావిహారులగుట సంభవింపక తీరదు. ఇంద్రియప్రాబల్యము నణచుట సులభసాధ్యము కాదు, కావున దుర్గమమగు యౌవనస్వేచ్ఛాచరణమే విదేశీయసాహిత్యమందెల్లెడ కన్పట్టుచుండును.

హిందూకుటుంబ ప్రేమవికాసము

ఆర్యసాహిత్య ప్రేమాదర్శమున దంపతీప్రేమ పరమశాంతమయ్యు వర్ణితమై తరంగితమగుచున్నది. అది పూర్వానురాగము మూలమున ప్రబలమగును. అల్పవయస్కులగు దంపతుల ప్రేమయందు పూర్వానురాగప్రవాహము అంతర్వాహినియై యుండి వెల్లివిరియుచు యౌవనమునపుడు తత్ప్రేమస్రోతస్స్ఫురణమును గని పెద్దలానందించుచుందురు. ఆ ప్రేమవాహిని పైట కుంబునేమో అను భీతిచే నవోఢ లొంగిక పెట్టుకొను దాని వణచుకొన యత్నించినకొలది అది అతిశయించి మెరుపుచందాన అప్పుడప్పుడు మెరయుచుండును. పూర్వానురాగము ఇట్లు ప్రకాశమగుట చేతనే దానిని ప్రశాంతముగను ఉపన్యాస ప్రసంగేతర రూపమునను ఆర్యకవులు చిత్రించిరి. నవోఢానురాగము కాలక్రమమున నతిశయించి ముగ్ధలను ప్రౌఢలగా నొనర్చి గృహిణులఁ జేయును. హిందూసంసార మట్టి గృహిణీప్రేమ పూరితము. అది కుటుంబమునంతట వ్యాపించి పతి, మఱది, అత్త, మామ, బావ, పుత్రుడు, పుత్రిక మొదలగు వారియందు సంక్రమించును. ఇట్టి చిత్రము లనేకములు ఆర్యసాహిత్యమున పొడచూపును. కౌసల్య, గాంధారి, సుమిత్ర, కుంతి, సీత, ద్రౌపది మొదలగు పాత్రము లిట్టి ప్రేమచిత్రములే. వయసు మీరిన ఆర్యమాతలెల్ల మహామోహ బద్ధులగుట కిదియే హేతువు. వారి హృదయములు స్నేహార్ద్రములగుటచే సంసారమంతయు వారికి వశమగును. గౌతమీ కౌసల్యల వాత్సల్య మిట్టిదే. (సశేషము)

క. "వంకరతొండము వేటల
పొంకముగల చెవులు పెద్దపొట్టయు నడగని
ర్వాంకల పంక్తులు పొగడఁగ
బింకముతోఁ దాల్చువయ్య వే ర్వేన
కరయ్యా 23"

2. విభక్తిదీపిక:—ఇది శాస్త్రాచి సుబ్బరాయులు నాయుని వారిచే రచియింపఁబడినది. సీతారామాచార్యులవారు దీనినిఁ బరిష్కరించి క్రీ. శ. 1869 లో ముద్రించిరి. ఇందు దాదాపు విభక్తులయు, వచనములయు రూపములున్నవి. తెలుగుభాష నేర్చు బాలుర కెల్లరకు నిది యత్యంతోపకారమని చెప్పవచ్చును. దీని నేఁ డెవ్వరును వాడుట లేదు.

3. వైకృతదీపిక:—ఇది ప్రకృతిపదము లగు సంస్కృతోపదములకు వికృతిపదముల నిచ్చును. ఇందు రెండువేల పదములకుఁ బైగా గలవు. ఇందు మొదట వికృతిపదమును, తరువాత నర్థమును నావెనుక నా ప్రకృతిపదమును నీయఁబడినవి. ఉదాహరణము.

| వికృతి | అర్థము | ప్రకృతి |
|---|---|---|
| అంకణము | నలుచదరపుజోటు | అంగణమ్ |

తొట్టికట్టు

ఇది 1873 సంవత్సరమున రెండవతూరి ముద్రింపఁబడినది. ఇదియును విద్యార్థుల కత్యంతోపయుక్తమైనది.

బాలచంద్రోదయము:--ఇది 1871 సంవత్సరమున రచియింపఁ బడినది. దీనినిఁ గూర్చి విశేషించి వ్రాయుట, నాకాలము నందలి సుప్రసిద్ధాంధ్ర వార్తాపత్రికలో నొకటియు, బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారిచేఁ బ్రకటింపఁబడు చుండునట్టియు నాంధ్రభాషాసంజీవని యను పత్రికపై వ్రాసిన దానినిట నుదహరించినఁ జాలును.

బాలచంద్రోదయము

"చెన్నపురినున్న రాజకీయబోధనాభ్యసన పాఠశాలయం దాంధ్రపండితులగు బహుజనపల్లి సీతారామాచార్యులవారిచే రచియింపఁబడిన బాలచంద్రోదయమను గ్రంథ మొకటి ముద్రితమై మాకర మలంకరించి నేత్రోత్సవ మొనరించెను. ఏతద్గ్రంథకర్తలయొక్క యుద్దేశము, ఇద్ది విద్యార్థుల కుపయోగార్థమని తెలియ వచ్చుచున్నది. మా యభిప్రాయమున్నదో యాలోచనఁ గాదు. మఱి యేమన్న, మన తెలుఁగుబాసయను మహారణ్యమునందు నర్థబింబపదములను సిద్ధమూలికల వెదకి కైకొనలేక వికలచెడి చదికిలబడిన విద్వాంసుల యుపయోగార్థ మని మా తాత్పర్యము. అట్లైనను ఇప్పట్లనే ఆ బాలపండితముగా నాంధ్రభాషాభ్యాసుల కందఱకు మిగుల ప్రయోజనకారి యని ద్రఢముగాఁ బలుకఁగలము. బాలచంద్రసదృశ మగు ఖండానుస్వార మే విధిబలంబునం బూర్ణచంద్ర సన్నిభంబగు సఖండానుస్వార మగును గనుక నగ్రాగ్యోక్త నామాంక సం

* తెలుగు కవి. చరిత్రము 878 పుట.

వీరాకు మేము మద్దతులువచ్చి విస్తారం పనులు ఉపకారంచేశినాం కాబట్టి యిఖమీద పైకానకు నిమిత్తం శేమ పోమ్మనుమన్నారు. యీమాటలు విజయరామరాజు విని కిమిడిమీదికి దండు యత్తి కొట్టి కొట్టినారు గనుక నారాయణదేవు పారిపోయినాడు అప్పుడు విజయరామరాజు అనేక కరారులు చేసుకుని జమాబంది నిర్ణయం చేసుకొని మరి యివతల వచ్చినారు. తి॥ నారాయణదేవు యీపగ యావత్తు మనసులో వుంచుకుని బస్తరుదేశం పోయి! అక్కడనుంచి మహారాష్ట్రులను తీసుకొని వచ్చి పూసపాటివారి దేశం యావత్తు లూటీచేయించి విజయరామరాజును పట్టి తల కొట్టవలెనని ప్రయత్నం చేశేవరకు రాజు పంజుబందీతో కూడా బహు జాగ్రత్తగా వుండి యెక్కడెక్కడ సిఫాహీయీలు కట్టి బహు బందోబస్తుతో వున్నంతలో మహారాష్ట్ర సరదారుడైన బ్రాహ్మడు యీరాజు యింతపని చేసినాడు గదా యితని బంట్రోతుధర్మమున్ను మా బంట్రోతు ధర్మమున్ను తెలుస్తున్న దని తెమ గుర్రం యావత్తు కిమిడెనుంచి అశి కాతరపు మన్యాలనుంచి పకదంమున దింపి బందరు హద్దుచేసుకొని గంజాం పరియంతరం పఖరోజున దిగిం దనిపించినారు— అప్పుడు రాజుగారు యక్కడ వుడితే అక్కడ నల్లా సకలజాగ్రత్తలు చేశి తాము అన్నాపల్లిదగ్గర వుండగా శీతారామనగరంనుంచి దేశస్తులు పోదుచుకుంటూ వచ్చినారు. అన్నాపల్లిదగ్గర పృథయులకు రామరావణయుద్ధ మయినది. అక్కడికి పడమటివైపు వడ్డాది దేశంలో వక నవాబు వుండగా అక్కడికి రాజుగారు మందుగుండు ఫిరంగులు తయారుచేశి పంపించేవరకు యిద్దరుమాలవాండ్లు సరదారులుగా వుండేవాండ్లు రాజునువట్టి తేక రాముని తమ సరదారు దగ్గిర ఖరారుచేశి తాంబూలం తీసుకొని వచ్చిరి గనుక ఆసమయంలో రాజుగారి రాణువ అనువుపుట్టి ఫిరంగులు బారుచేశి కొట్టేవరకు అంబారి యివతలికి రాకూడకుండా వుండెను. ఆసమయంలో అన్నాపల్లి జమీదారుడైన నల్లమందు నాయ్కురాయునింగారు వెయ్యింటికి యీ సంజ తీసుకునిపోయి రాజుగారి అంబారి మళ్లించి కోటలోకి తీసుకువచ్చి ప్రవేశపెట్టినారు. ఆరోజున విజయరామరాజు బ్రతికడం బహు దుస్తరమయినది. తి॥ తుంమలపాల కణవాయిదగ్గిర మాలవాండ్లు యిద్దరు వడ్డారన్న కబరు విన వేగం యక్కడ

గుఱ్ఱం అక్కడ పరారి అయి దేశం అంతా లూటీ చేశినారు. వారిదేశం నుంచి వచ్చిన గుఱ్ఱంలో ముప్పాతికె పాలు విజయరామరాజుగారిచేతను మరణం అయినది గన్క ఆ సరదారుపమూనకుని మాగుఱ్ఱం ముప్పాతికెపాలు హతమయినది. యింతలడాయీ నేనుయింనమూ చేశినదిలేదు. చూచినదిలేదు. యిది గాక యీ మన్యాలులో గుఱ్ఱం రావడం బహు ప్రయాస! యీపనులకు రావడం బుద్ధి చెడిపోయి రావడమయ్నది—
అని నారాయణదేవువారితోటి చాలా విచారపడి వారు మునుపు యేమి యిస్తామని ఖరారుచేశి తీసుకువచ్చినారో ఆ ప్రకారానికి వయికం దాఖలు చేస్తూని మహారాష్ట్రిలు తమ దేశంలోకి వెళ్ళిపోయినారు—

తదనంతరం విజయరామరాజుగారు నారాయణదేవువారికి ఖచులు చాలా తగిలడమున్ను మహారాష్ట్రిలకు కట్నం కానికెలు యివ్వడంచాత తగులుబాటు కావడమున్ను యిది యావత్తు చూచి యీ పద్దతును గన్క అయితే మనము సాధించవచ్చును. అని ఆలోచన చేస్తూని తన లష్కరు యావత్తు కూడుకొని కిమిడిమీదికి కూడ్చేశేవరకు యీసంగతి వారికి తెలిశి జాగ్రతపడుతూ వుండగా విజయరామరాజుగారు సైన్యయుక్తంగా పోయి పడి వారిని సాధించి కోటలో ధాన్యం కేస్తూని వీరిని జేసుదస్తులోకి తెచ్చుకుని వీరి బిరుదులు వీర కాశీలు మొదలైనవి తీస్తూని అంతట దేశం వారికి యిచ్చి కొంత జమాబంది నిర్ణయం చేస్తూని వచ్చినారు— యీవార్త కొన్నిదినములు జరుగుతూ వుండేది. యిక్కడ చిత్రకథ—

బస్తరుదేశస్తులు మహారాష్ట్రిలకు తను దేశంలోనుంచి త్రోవ యిచ్చినారన్న క్రోధం చాలా వుండి వారిని యేవిధంచాతనయినా సాధించవలెనని రాజు మనస్సులో వుండేది గాని ఆ బస్తరుదేశం నాగపురి ధక్కను కిందిది గన్క వీరికి ప్రస్తుతం అనుకూలం రాకపోయినది. యిది పూసపాటివారి కథలలో సాఫుగా వ్రాశివున్నది—

తా॥ నారాయణదేవువారు విజయరామరాజు యక్కడికి మద్దతుతీసినా పాతూరి అతనికి యిష్టుడై రాజ్యం చేస్తూ వుండి విజయరామరాజుగారు పోయిన

మరికొన్ని దినములు నవ్వాబులు యీ వత్తు కుంఫిణీ అధికారం ఆయె గన్క వీరికి వారికి బనాయించక రెండు పరియాయాలు యుద్ధం జరిగిన వెనుక నారాయణదేవుకు మనస్సు చదురుపుట్టి యెక్కడ నయినా తుపాకిశబ్దం వినకుండా వుండవలెనని అప్పుడు తన కొమారుడైన గజపతిదేవు కోమలంగా వున్నాడు గన్క దేశం యితనికి పట్టంకట్టి తనకు యేమీ అక్కరలేదనుకుని పుణ్యస్థలాలు యాత్ర చేస్తూ మరికొన్ని దినములను గతించెను, తదనంతరం గజపతిదేవు బహు ధైర్యవంతం గలవాడు గనుక తండ్రివలెనే రాజ్యం చేస్తూ వకటి రెండుమార్లు కుంఫిణీ వారితో యుద్ధంచేశి వారికి జేరు దస్తుతోకి రాకుండానే వుండి కుంఫిణీవారు బలవంతులైనందున వెనక నిభాయించలేక కుంఫిణీవారికి పట్టుబడినందున వారు తీస్కువచ్చి విశాఖపట్నం కోటలో ఖయిదు చేయించినారు. యీలాగున అనేకదినములు వుండగా కుంఫిణీ వారి తరఫున శేఖుమక్తుంసుబేదారు వుండేవాడు. అతణ్ణి గజపతితో కూడా పడవమీదికి యెక్కమని కుంఫిణీవారు ఆజ్ఞాపించేవరకు ఆసుబేదారు పటాలం యావత్తు ఆలోచన చేస్కుని మేము వాడ యెక్కవారకు నిమిత్యంలేదు. కాలు వుండేటప్పుడు వాడ యెక్కుతామని వుండలేదు కాబట్టి యిప్పుడు మేము వాడ యెక్కేది లేదన్నారు. అందుకు కుంఫిణీతరఫున వచ్చిన నవ్వాబు డెవీడ్జదొరగారు కోపించి తాము కా! యెక్కడ కూడదనేవరకు సుబెదారు పటాలం యావత్తు తయారు అయి జాతుల వారిని శిపాయిలను అనేక మందిని చంపి కొందరి జాతుల వారిని ఫిరంగులకు కట్టించేవరకు దానితో కొందరు హతమయిరి. యిట్లావుండే సమయమందు నాలుగు ఘడియలు శేఖుమక్తుంసుబేదారు దగ్గిర గజపతిదేవుగారు దివాను అయిరి. కోటలో బొక్కసాలు యావత్తు తీసి రూపాయీలు వరహాలు వెదచల్లించేవరకు ఆసరి అనేకమంది భాగ్యవంతులైరి. పిమ్మట యీ డెవిడ్జ దొరగారిని సుబేదారుడు శిరచ్ఛేదనం చేయించవలెనని తీస్కువచ్చేవరకు అతను మంచిమాటలు చెపుతూ, శ్రీ మహారాజు శేఖుమక్తుం సుబేదారు మహా మహారావుకకు మెహర్భానీకి రఖుమహారాజ్ అంటూ వుండగా అందున తుర్క వానికి విశ్వాసం లేక ఫిరంగి దగ్గిరకు తీస్కుపోయి వత్తి ముట్టించుమని తెలుపు యిచ్చేవరకు యింతలో గజపతిదేవువచ్చి

సుబేదారును చాలా బ్రతిమాలుకొని తన పటాలంతో కూడా విశాఖపట్నం యితణ్ణి వదల వలెనంటే వారు అన్న నుంచి వెళ్ళిపోయినాడు.

మాటలు—

నా కాలికి తొడిగిన పైజారు యీడు యెత్తినా వదలుతాను. లేకుంటే వదల నని ప్రతిజ్ఞలు పట్టేవరకు గజపతి దేవుగారు అతనిబదులు నేను యెత్తుతాను యితని ప్రాణం కాచమనేవరకు అక్కడికి ఆమాటలువల్ల మనస్సంమతి కాకపోయె గన్క గజపతిదేవుగారు తన పరాక్రమం తమ తండ్రి పరాక్రమం యావత్తు సుబెదారుతో చెప్పి నీ పైజారు నాచేతితో యెత్తుతానని నా యావత్సామర్థ్యమయి యింత నీచపుమాటలు నేను చెప్పను. పరుల ప్రాణం కాయడం గన్క నీతో యింత మనవి చేస్తుంటున్నాను నా మనవి చెల్లించ వలెనని అన్నందుక్కు అందున క్రియ లేకపోయె గన్క గజపతిదేవు పని మించిపోతే ప్రయాస అనుకుని ధఫాలున వాని కాలి జోడు చేతితో యెత్తబోయ్యేటప్పుడు యింతలో వారికి దయ వచ్చి యితణ్ణి మీకు యీనాం యిచ్చినాం యితని మీ యాలంచాత నయినా రాజ్యాధిపత్యం చేస్తుని సుఖంగా వుండుమని చెప్పి

త॥ జవిర్జ దొరగారు యీ నమాచారములు యావత్తు కొండుకు వ్రాసి గజపతిదేవువారు నన్ను బ్రతికించినారు యితనివల్ల బ్రతికినాను అని యిక్కడ యితను చేశిన చరియలు యీలాగంటిపి యితను మన హితవును కోరినవాడు తిరిగి దేశం యివ్వావలశినది అని వ్రాయించి చన్నపట్నంనుంచి తిరుగా బహాలి తెప్పించి గజపతిదేవువారికి తీసుకొనిపోయి కిమిడిలో పట్నం కట్టి తాలూకా వారి అధీనం చేయించినారు గన్క తదారభ్యా శ్రీకాకులం హావేలీతాలూకాకు యిస్తాటువారి కల్కటరీ వచ్చేపరియంతమున్ను వఖ్తీతుగా జరిగింది. నళ పింగళ సంవత్సరములలోపల ధాన్యం బహు చవక కావడమున్ను రూపాయీ పుట్టక కుంఫిణీ వారి జమాబందీకి దేఖిలురూపాయీలు పుట్టకపోయె గన్క ధాన్యం కొలుస్తామని జవాబుస్వాలు చేస్తూవుండిరి. యింతలో వారిదగ్గిర వున్న శిఫాయీలు జీతాలు యిప్పించుమనిరి—అందుకుగజపతిదేవు